భంగమని తలంచువాఁడు కాఁడయ్యెను. ఆమహనీయుని లక్ష్మి యనఁగా మహామాయ మహత్తరమైనది. ఇట్టి రాజ్య కోటులనుగాక యనేక బ్రహ్మాండములను గల్పించునది. కావున నిది యొకకోటి అంతగా శ్రీరాముఁడు భావింపలేదనియే యిందు గ్రహింపఁదగు విషయము.

> "వాచా మధురయా రామస్సర్వం సమ్మానయన్ జనం,
>
> మాతుస్సమీపం ధీరాత్మా ప్రవివేశ మహాయశాః."

అని మూలము. మనోహరములనఁగాఁ జెవులకుఁ బండువు చేయునవి. అట్టిమాటలచే నెల్లవారిని గారవించుచు ధీరాత్ముఁడు మహాయశుఁడు గావునఁ దల్లియింటికిఁ బోయెను తన యవతారఫలము లోకములకు సమకూర్ప సమయ మరుదెంచె నన్న సంతోషమున నెల్లవారల నుమ్మలికము గ్రమ్మకయుండ నాశ్వాసించుచుఁ దల్లిచెంతకుం బోయెను. సామాన్యులకుఁ గలుగుదుఃఖము మోహముననే తాండవమాడుచుండును. ఆస్థితి యందు వారు సరసవాక్కులు పలుకఁజాలరు. భగవంతున కట్టి దుఃఖము లంటవుగదా. కనుకనే శ్రుతిహితములగు వాక్కుల చేత నెల్లర నూఱడించుచుఁ బోయెనని మన మెఱుంగవలయు. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అను శ్రుతివాక్య ననుసరించి యానందమే పరమేశ్వరస్వరూపము. కావున నాలక్షణము కనంబడఁజేసెనని యీభాగము మనకుఁ దెలుపుచున్నది. ఇట్లు గ్రహించి సదానందరూపమును ధ్యానింపవలయును. అట్లు ధ్యానము చేయువారలకు సంసారతాపత్రయములు బాధింపఁజాలవని యోగులు పలుకుదురు.

"యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ"

అన్న లోకోక్తియు,

"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్"

అన్న భగవద్గీతోక్తియుఁ బ్రమాణములు కాకపోవు కదా. కావునఁ బరమేశ్వరుని నానందబ్రహ్మమును సర్వకారణుని జక్కనిభక్తిమై నారాధింపవలయును. ఆరాధించుమార్గములలో ధ్యానమార్గ ముత్తమము మనోవీథి నెలకొల్పఁబడిన తేజోరూపమును ధ్యానించుచు నిరతిశయానందము ననుభవించుచుండుటయే జన్మసాఫల్యము. విగ్రహారాధనము చిరకాలము చేసినను ఫల మత్యల్పము. భగవంతునిరూపము భక్తులచే నిచ్ఛానురూపముగాఁ గల్పింపఁబడును. అయ్యది యొకలు దొలుత మనోవీథి నెలకొనఁజాలదు. కావున విగ్రహముల నిర్మించుకొని పూజించు టవసరమయ్యెను. పాషాణాదులయందు భగవద్బుద్ధి పామరులకు ధ్యానము కుదురుటకుగా నుపకరించును. ఆవెనుక నయ్యది నిరర్థకమగును. నిర్జనస్థలమునే యోగులు కోరుదురు. ధ్యానమునకు వస్తువ్రాత మక్కఱలేదు. నిశ్చలమనస్సుమాత్రమే యుండవలయు. అయ్యది పూర్వకర్మానుసారముగా లభించినయోగనిరతి ననుసరించియుండును. ఎప్పుడాసిద్ధి చేకూరునో ముక్తి యప్పుడు కరతలామలకమే. ముక్తిస్థానమనఁగా నొకలోకము కాదు. అందు దివ్యహర్మ్యము లుండవు. అందు విహరించుటయు ముక్తి కానేరదు. అవ్యయానంద మనుభవించుమార్గము దొరకుటయే ముక్తి. ఆస్థితియందుండువాఁడు సమదర్శనుఁడై యుండును. పాంచభౌతికశరీరముతో నుండవచ్చును. వేఱొకరూపమున నుండవచ్చును.

ముక్తిస్థానము వైకుంఠమని కొందఱు, కైలాసమని కొందఱు, సత్యలోకమని కొందఱు, ఈమూఁడునుగావు. ఇంకొక్కలోకమని మఱియుఁ గొందఱు చేతులం ద్రిప్పుచుఁ బలుకుదురు. అది యొకలోకమైనచో నాముక్తి యెవ్వరికిని వలదు. లోకము శాశ్వతమనుట వెఱ్ఱిమాట. ఆనమ్మకముకలవారల కదియు నొకవిధమగుముక్తియే కావచ్చును. కాని వారికిఁ బునరావృత్తి కలదు. ఇదియే యుపనిషన్మతము. యోగమత మిదియే. భగవదుపదేశ మిదియే. ఇంకొక్కటి కాదు.

ప్రకృత మనుసరింతును. మహానందసాగరమున నోలలాడుచు నితరులకు దారుణవృత్తాంతముగనున్నను శ్రీరామున కయ్యది శుభోదంతముగాఁ దోఁచెను. తనయవతారమునకు ఫలములు దుష్టసంహారశిష్టపాలనధర్మసంస్థాపనము లేకదా. వానికిఁ బ్రయత్నమే ముఖ్యసాధనము. తనయిచ్ఛాశక్తియగు సీతాసంకల్పమే కైక నట్లు ప్రోత్సహించెను. అసంగుఁడయ్యు శ్రీరాముఁడు సంగిభంగిఁ బ్రవర్తింపఁబూనెను. ఆమహాపురుషునిమనోవీథియం దానందము తాండవమాడుచున్నది. సుస్మితము మోమునఁ జెలరేఁగుచున్నది. ధర్మసంస్థాపనము చేయవలయునన్న సత్సంకల్పము బుద్ధియందుఁ దాండవము సల్పుచున్నది. తనకుఁ గష్టముగలిగెనే యని వగచుమిత్రులం గాంచిన వీ రెంతపామరులా యన్నజాలి యుదయించుచున్నది. దండకారణ్యవాసుల రక్షించుకార్యమున నుత్సాహము పెరుగుచున్నది. అయోధ్యానివాసమున క్షణముగూడఁ గడపరాదన్న యాశయ మంకురించి పురికొల్పుచున్నది. తల్లికిం దెల్పఁబోవునపు డిట్టు లాభగవంతుఁడు పెక్కుముఖముల సంతో

షము వెల్లివిరియఁగా నొప్పుచున్నాఁడు. అట్టిభక్తగరిష్ఠునాన్మతిం
గాంచి మహానందమున నొప్పు నాశ్రీరామచంద్రునిరూపము
ధ్యేయమనుట యతిశయోక్తి కానేరదు. యోగు లారూపమునే
ధ్యానింతురు. కన్నులకు ఫలమన నదియే. అనేకజన్మార్జితసత్కర్మ
ఫల మదియే. యోగాభ్యాసజనితమహానందఫల మదియే.
కావున నట్టి ధర్మసంస్థాపనిరతచిత్తుఁడై మహాప్రపన్నవశం
గతుఁడై ప్రవృత్తిమార్గమునఁ బ్రసిద్ధిం జను నాదేవదేవుని
గరుణాశరధిని దాశరథిని నిర్మలమనస్సున ధ్యానించుటయే
యిక్కలికాలమున విశేషించి యుత్తమకార్యము. శ్రీరామ
భక్తులమనువారు రెండవటో కలరు. దేవాలయములు కట్టఁబడు
చున్నవి. తరణోపాయమగు ధ్యానమార్గమును బోధించువా
రరుదుగ నుండుననవచ్చును. ధనమునేకరించుట కీకాలమున
వేదాంతశాస్త్రము, భక్తిమార్గము, మంత్రోపదేశము ననునీ
మూఁడును ముఖ్యములుగ నున్నవి. పామరులు భగన్నామ
సంకీర్తనము చేయుచు, దానికి ఫలముగా మనస్సున నొక్క
గడియనేనయిన నాభగవత్కల్పితమూర్తిని ధ్యానింపనభ్యా
సము చేయవలయును. దాననే యాపరమేశ్వరుఁ డానందిం
చును. భక్తులని వారల సంభావించును. కృతార్థులనుగా నొన
రింప నూహించును కావున విగ్రహారాధనము చేయువారుం
గూడ నామూర్తినే మనస్సున నొక్కక్షణకాలమైన నిలుపు
కొనఁ బ్రయత్నింతురుగాక. కపటనాటకసూత్రధారులమోస
మునకు లోఁబడి ధనము పోఁగొట్టుకొనక యుందురుగాక. కట్టి
యున్న దేవాలయములే చాలును. అవి మానవుల నుద్ధరింపఁ
జాలవు. మహనీయధ్యాన ముద్ధరింపఁగలదు. కావునఁ దదభ్యాస

మునకై ప్రయత్నము చేయవలయు. ఇది కలియుగము. సనాతనాచారములు తారుమారగును. ధర్మపద్ధతులు తలక్రిందులగును. వానిని సరకుచేయక ప్రతిమానవుఁడు తనతరణోపాయమును జూచుకొనవలయును. దానికిందగుమార్గ మేదియని పరికింపవలయును. శ్రీపరమేశ్వరు నామసంకీర్తనము సర్వదా చేయుచుఁ, దచ్చరిత్రామృతమును గ్రోలుచుఁ, దుచ్ఛలయుపదేశముల నాసక్తింగొనక, యితరు లారాధించు దేవతల దూషింపక, సర్వమతములు పరమేశ్వరునే మార్గభేదముల నాయామానవులకుం దగినయట్లు దేశకాలముల నెఱింగి బోధించును గాన వానియాశయ మెఱుంగకయే వానిదూషింపక, పరమతములయందు నోర్పుగలిగి తమకు నభ్యాసమునఁ దెలిసినవాని నితరులకు మంచిమాటలచేఁ దెల్పుచు, వార లాదరింపనిచో దూషింపక శాంతముసహించుచు, ధర్మమార్గమును దెంపొందఁ జేయుచు భగవంతుని సేవింపవలయును. ఇంతకంటె నుత్తమము సులభమునగుమార్గము కానరాదు. కావున మానవులు భక్తిశ్రద్ధలతో శ్రీరామచంద్రుని సేవించి కృతార్థులు కావలయును.

"రామం రాజశిఖామణిం రఘుపతిం దేవారిదర్పాపహం
లోకానాం హితకారిణం గుణనిధిం కారుణ్యపుణ్యోదయం,
ముక్తావిద్రుమరత్నశోభితతనుం సౌందర్యహాస్తాంబుజం
కౌసల్యాతనయం భజామి సతతం శ్రీజానకీనాయకం. ౧౮

రామం వీరాసనస్థం హృదయగతకరోదంచితజ్ఞానముద్రం
జానున్యాసక్తహస్తం క్షితివరతనయాభూషితం వామభాగే,
షట్కోణే వ్యాహరంతం పవనసుతయుంతం మానసే మానయంతం
సుగ్రీవే సేవమానే దృఢశరధనుషా దక్షిణే లక్ష్మణేన. ౧౯

రామం సౌమిత్రిమిత్రం రఘుపతిమమలం రామచంద్రం రమేశం
రమ్యం శ్రీరాఘవేశం శుభలలితముఖం శుద్ధసత్త్వం సువీరం,
సీతాసౌందర్యపాత్రం సురమునివినుతం నీరదేందీవరాభం
వందే వందారుపాలం రజనిచరహరం రమ్యకోదండరామమ్." ౨౦

ఈరీతిగా శ్రీరామచంద్రు నాకారమును మనస్సున నెలకొలిపి ధ్యానింపవలయును. మానసపూజానిరతులము కావలయును. అదియే యుత్తమోత్తమమార్గము. ఓంశాంతిః శాంతిః శాంతిః.

ధర్మరక్షణప్రయత్నమను మూడవప్రకరణము

సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1932.